(చుండవని కాని) నిజము చెప్పుటకు జంకుచున్నాను. లేదు, లేదు. నేనగస్త్యుండ నగుట వలనే జ్యోత్స్నాసాగరములనిన చెలువను. నిక్కముగా నీ పతివర్యతోన్న తుండవు. అవిరళభాగధేయుండవు' అని భావము.]

పై పద్యము వాదమున కంత ప్రబలప్రమాణమగునాయని కొందఱి సందేహము. కాని పై పద్యము పృథక్ప్రమాణ మనక తప్పదు. కానిచో నీ శ్లోకమున నగస్త్యపదమునకు సార్థక్యమే కనంబడదు. పై ప్రమాణమునే యాధారముగాఁ గైకొని యగస్త్యుని 'నలకీర్తి కౌముది'కిఁ దాము రచించిన పీఠికలో శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి వర్యులు[36] అగస్త్య విద్యానాథుల యైక్యమును సిద్ధాంతీకరించియున్నారు.

సంస్కృతసాగరమును మథించి, లౌకికసంస్కృత వాఙ్మయచరిత్రమను బృహద్గ్రంథరాజమును రచించి (1941) స్వర్గవాసులైన సాహిత్య విద్యాధ రేణ్యాదిబహుళబిరుదాంకితులగు డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యుల వారు[37] కూడ నైక్యవాదమునే సిద్ధాంతముగా గ్రహించియున్నారు.

అగస్త్య విద్యానాథులకాలమును బట్టి చూచినను పై వాదము సరియే యని తోఁపక తప్పదు. ఏమన, విద్యానాథుఁడు త్రిలిఙ్గదేశము నందలి ఏకశిలా నగరమున (= ఒరంగల్లు, ఓరుగల్లు లేక వరంగల్లున) రాజ్యపాలన మొనరించిన కాకతీయ ప్రభువతంసుఁడగు రెండవప్రతాపరుద్రుని కాశ్రితుఁడు (క్రీ. శ. 1295–1323). అగస్త్య మహాకవికూడ నీకాలపువాఁడే యైనట్లీ తార్కాణముబట్టి తెలియుచున్నది. సిద్ధనాథునికిఁ బౌత్త్రుఁడు, గంగాధర మహాకవికిఁ బుత్త్రుఁడు, 'కాదంబరీనాటక' ప్రణేతయగు నరసింహకవి కగ్రజుఁడు నగు విశ్వనాథకవి 'సౌగంధికాహరణ' ప్రేక్షణమునఁ దన కగస్త్యుఁడు మేనమామ యని పేర్కొనిన పద్యము నిదివఱకే యుదాహరించి యున్నాను. విశ్వనాథకవి క్రీ. శ. 13, 14 వ శతాబ్దములలో రాజ్యముచేసిన కాకతీయ ప్రతాపరుద్రు నాస్థాన కవులలో నొకఁడు. ఈ విషయము 'సౌగంధికాహరణ' ప్రస్తావనలో నిట్లు లిఖింపఁబడెను.

'సూత్రధారః – అద్య ఖలు నిఖిలరాజలోక మౌళిమాణిక్య మఞ్జరీ పుఞ్జపిఞ్జరీకృత చరణారవిన్దేన, బృన్దారకనగర కామినీ ముఖాధివాసచతుర

36. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - 19 సంపుటము. 1. 2 సంచికలు. (1930)

37. డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులవారు 'లౌకికసంస్కృతవాఙ్మయ చరిత్ర' - (పుట 214). (History of Classical Sanskrit Literature-1937).

యశఃకర్పూరపూరిత. కైలాసః శ్రీ ప్రతాపరుద్ర నిజభుజతులితజ్ఞఖురసమృద్ధజనిసవ మిశ్రితజలధి సర్వజ్ఞ సర్వోత్కర్ష ప్రతాపరుద్ర ప్రవర్తమాన పీఠ శ్రేణి, లాజ్ఞా ప్రజాప దుర్దేశ సాహిత్యై శ్లోకే. విద్యాధీశాసనసార్వజ్ఞ్య గ్రంథానాం సుమతిభిః, సభా సద్భి రాహూయ, సబహుమానం మానమస్మి న్రస్త్రి (సౌగన్ధికాహరణమ్)[38]

మఱియు కాంచీపురమున క్రీ. శ. 1367 సం. ప్రాంతమున రాజ్యము చేసిన వీరకంపరాయలకు రాణి యగు కవయిత్రి గంగాదేవి మధురావిజయ కావ్యమున తిక్కయజ్వను, అగస్త్యని, గంగాధర కవులను స్తుతించి, విశ్వనాథుని దనకు గురువుగా నిట్లు ప్రశంసించి యున్నది.

శ్లో. 'చిరం స జీయాద్ భగవాన్ విశ్వనాథః కవీశ్వరః,
యస్య ప్రసాదాత్ సార్వజ్ఞ్యం సమిన్ధే మాదృశేష్వపి.'
(మధురావిజయము. 1. 16)

విశ్వనాథకవిరాజు[39] (క్రీ. శ. 1300-1384) 'సాహిత్యదర్పణము'న వ్యాయోగ లక్షణమును వర్ణించుచు, దానికి లక్ష్యముగా 'సౌగంధికాహరణము'ను పేర్కొని యున్నాడు:

'యథా సౌగన్ధికాహరణమ్' —(సా. ద. 6 కారికలు. 231-33)

కావున, గంగాదేవిచే స్తుతింపఁబడి, విశ్వనాథకవిరాజుచే సూచింపఁబడి, కాకతీయ ప్రతాపరుద్రుని యాశ్రితుఁడయిన విశ్వనాథకవి, క్రీ.శ. 1294-1325సం. ప్రాంతమున జీవించి యుండె ననుట సమంజసముగాఁ గన్పట్టును. ఇతనికి మేనమామ యగు నగస్త్యుఁడు కూడ నా కాలమువాఁడే యగును. కావున విశ్వనాథుని కాలమున కగస్త్యుని కాలము కూడ సరిపోవుచున్నది. అందువలన నైక్యవాదమును నిర్వివాదముగ సిద్ధాంతీకరింప వచ్చును.

## 3. విద్యానాథుని కాలము

అగస్త్య విద్యానాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని సన్నిధిని మంత్రిగా నుండినట్లు కథలవలనఁ దెలియుచున్నదని శ్రీ వెంప్యాల వేంకటసుబ్రహ్మణ్య

38. కావ్యమాల. 21 వ పుష్పము, (నిర్ణయసాగర ముద్రణాలయము, బొంబాయి, 1902).

39. సౌగన్ధికాహరణకర్త యగు విశ్వనాథకవి. సాహిత్యదర్పణప్రణేత యగు విశ్వనాథకవిరాజుకంటెఁ బూర్వుఁడని యెఱుఁగునది.

శాస్త్రి వర్గులు 'సకలకీర్తికౌముది' పీఠికలో వ్రాసియున్నారు. విద్యానాథ బిరుదమును బట్టి యీతఁడు విద్యాంగమంత్రిగా (Minister for Education or Director of Public Instruction) లేక విద్యాధికారిగ నుండియుండు నని కూడా నూహింపవచ్చును. మహావిద్వాంసులును, మహాకవులును గూడ హైందవ ప్రభువులకడ మంత్రులుగా నుండి రనుట కుదాహరణము లనేకములు గలవు. కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు కొండవీటి ప్రభువునొద్ద విద్యాధికారిగా నుండెను. ప్రతాపరుద్రుని మంత్రి యగు నగస్త్య విద్యానాథుని 'బాలభారత' మను మహాకావ్యమునకు, 'మనోహర' యను చక్కని వ్యాఖ్యను రచించిన విద్వచ్ఛిరశ్చూడామణి యగు తిమ్మరుసు కృష్ణదేవరాయల యొద్దఁ బ్రధానామాత్యుఁడు (దండనాథుఁడు) గా నుండ లేదా?

ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు పేర్కొనిన గ్రంథకర్త లందఱి యందును అలంకారసర్వస్వ[40] కారుఁడగు రుయ్యకుఁడు నవీనుఁడు (క్రీ. శ. 1135-1155)[41] 1154 వ సంవత్సరమువఱకు ఉత్పన్నమని యెంచఁబడిన రుయ్యకుని కృతి, 'సాహిత్యమీమాంస' కూడ విద్యానాథునిచేఁ బేర్కొనఁబడెను.[42] అందువలన, క్రీ. శ. 1155 ఈతని కాలమునకుఁ బూర్వావధి యనఁదగును. 'అలంకారకౌస్తుభము'న విశ్వేశ్వర పండితుఁడును[43] (క్రీ. 18 వ శతకారంభము) 'చిత్రమీమాంస'[44] యం దప్పయదీక్షితులును 'ప్రతాపరుద్రీయము' నుల్లేఖించుకొనిరి. కాని, వీ రిరువుర కంటెను బూర్వుఁ డగు మ.మ. కోలాచల మల్లినాథసూరియే (క్రీ. శ. 1422-'66)[45] కాళిదాస కావ్యత్రయమునకుఁ దాను రచించిన సంజీవినీ వ్యాఖ్యలయందును, భారవి 'కిరాతార్జునీయము' పై వ్యాఖ్యయగు 'ఘంటాపథము' నందును, 'సర్వంకష' యను 'శిశుపాలవధ' వ్యాఖ్యయందును, 'సర్వపథీన' యను 'భట్టికావ్య' వ్యాఖ్యయందును[46] అలం

40. IV. ప్రకరణము 245 పు; IV. ప్ర. 285 పు. (వావిళ్ళవారి ప్రతి (1927)

41. చూ. మదీయ 'సంస్కృతసారస్వతచింతామణి' - మరీచి 4. 16-22 పు. (1935).

42. (9 వ పుట యందు).

43. కావ్యమాలా ప్రచురణము 12 పు. (విశ్వేశ్వరుఁ డిట అప్పయదీక్షితుల యభిప్రాయములను ఖండించి, విద్యానాథుని సమర్థించి యున్నాఁడు.

44. నిర్ణయసాగర ముద్రణము, 7, 8, 56-58, 84, 87 పుటలు.

45. Dr. V. Raghavan : *The Vaisyavamsa Sudhakara of Kolacala Mallinatha* - Published in *A Volume of Indian and Iranian Studies* in honour of Sir E. D. Ross, p. 235 (1939).

ప్రాసంగికముగా సూచించి యున్నాను. ప్రకరణములో నింకను విశదముగాఁ దెలుపుదును. క్రీ. శ. 1271–1309 ప్రాంతములకు జెందిన, దేవగిరి రాజధానిగా రాజ్యము నేలిన యాదవ ప్రభువగు సేవణుఁడను రామదేవ భూపాలుని ప్రతాపరుద్రుఁడు యుద్ధమున జయించెనని చారిత్రక ప్రమాణములను బట్టియే కాక విద్యానాథుని కృతిని బట్టి కూడఁ దెలియుచున్నది.[49] దీని వలన ప్రతాపరుద్రుఁడు పదమూఁడవ శతాబ్ది యందును చతుర్దశ శతాబ్దియందును, పదునాల్గవ శతకమునఁ బ్రతాప చరణమునకు క్రీ. శ. 1875–14[illegible]5) జెందియుండునట్లు స్థూలముగాఁ జెప్పవచ్చును. క్రీ. శ. 1323 వ సంవత్సరమునను, క్రీ. శ. 1326 వ యేఁటనో ఢిల్లీ సుల్తాను మహమ్మదీయ ప్రభువగు 'మహమ్మదు తుగ్లక్' సేనచే బందీకృతుండై ఢిల్లీ పురమునకుఁ గొనిపోఁబడినట్లు చరిత్రలను బట్టి తెలియుచున్నది. ఈ హేతువులఁ బురస్కరించుకొని డాక్టర్ మహామహోపాధ్యాయ పాండురంగ వామన కాణే పండితుఁడు[50] 'ప్రతాపరుద్రీయము' క్రీ. శ. 1310–25 ప్రాంతమున రచింపఁబడి యుండునని సిద్ధాంతీకరించెను. వాఙ్మయచరిత్రగవేషణ ప్రవీణులగు పండిత ప్రకాండు లించుక మతభేదములతో విద్యానాథుని కాలము నిట్లు నిర్ణయించియున్నారు.

| | |
|---|---|
| డాక్టర్ సుశీలకుమార్ దే[51] | 1280–1310 |
| ప్రొఫెసర్ కమలాశంకర ప్రాణశంకర త్రివేది[52] | 1298–1317 |
| ప్రొఫెసర్ ఎగ్లింగ్[53] | 1298–1317 |
| ప్రొ. సూయల్[54] | 1285–1323 |
| ప్రొ. శేషగిరిశాస్త్రి[55] | 1295–1319 |

49. I. ప్ర. 36 పు. IV. 194 పు.

50. Dr. Prof. (Mahāmahopādhyāya) P. V. Kane: *History of Alankara Literature*, p 283, 2nd edition (1951).

51. Dr. S. K. De: *History of Sanskrit Poetics* Vol. I. p. p. 309, 2nd revised edition, Calcutta (1960).

52. Prof. K. P. Trivedi; *Introduction* to his ed. of *P. R. Y. Bhusana* pp. II ff. (1909). Bombay.

53. Prof. J. Eggeling: *India office Catalogue of Sanskrit Mss.* III 338 p.

54. Prof. Sewell: *Sketches of the Dynasties of Southern India* p. 32.

55. Prof. M. Seshagiri Sastry: *Reports of Sanskrit Mss.* II p. 82.

శ్రీ చిలుకూరి వీరభద్రరావు[56] 1290-1326
డాక్టర్ మారేమండ రామారావు[57] 1290-1326

దీనినిబట్టి ప్రతాపరుద్రుఁడు క్రీ. శ 1290-1326 నడుమ రాజ్యపాలన మొనరించెననియు, నాతని యాస్థానకవిత్వకవిచంద్రుఁడగు విద్యానాథుఁడు క్రీ. శ. 1275-1325 ప్రాంతముల విలసిల్లి యుండె ననియు నిర్ణయింపఁ దగును. ఇంచుమించుగా విద్యానాథునకు సమకాలికులగు నాంధ్ర రచయితలు, గీర్వాణగ్రంథకర్తలు చాలమంది కలరు. వారి నామములను. వారి రచనల పేర్లను 3 వ యనుబంధమునఁ జూడఁదగును.

## 4. విద్యానాథుని రచనలు

**1. అగస్త్యనిఘంటువు[58] :** జాతీయాభ్య సంస్కృత విద్వత్కవి, శకట గ్రంథ నిర్మాతయునగు ఘనశ్యాముఁడు భవభూతి కృతమగు నుత్తర రామ చరితమునకు రచించిన వ్యాఖ్యలోఁ బహుసారు లగస్త్యకోశము నుండి ప్రమాణముల నొసఁగి యున్నాఁడు. ఈ నిఘంటు కర్తయు విద్యానాథాగస్త్యుఁడు నభిన్నులే కావచ్చునని నేనమకొనుచున్నాను. భిన్నవాదమునకుఁగాని, ఐక్యవాదమునకుఁగాని ప్రమాణము లేవియు లభింపలేదు. ఘనశ్యాముఁ డుదహరించిన 11 ఆకరములను గ్రంథాంతరమునఁ జూపియే యున్నాను[59].

**2. కృష్ణచరిత్రము :** ప్రసిద్ధ భాగవతకథ నాశ్రయించి రచింపఁబడిన యీ గద్యకావ్యమున శ్రీకృష్ణచరిత్ర ప్రౌఢరసవత్తరశయ్యతో నతిహృదయావర్జకముగా నున్నట్లు తెలియుచున్నది. చరిత్రాత్మక విషయము లనేకము లిందుఁ గల వనియు, సంస్కృతమున నుత్తమగద్య కావ్యములలో నిది యొకటి యనియు, దీనిని బరిశీలించిన స్వర్గీయ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రివర్యులు చెప్పియున్నారు. అపూర్వం పశ్య యగు నీ కావ్యమన్య త్వరలో సూర్యాలోక భాగ్యమునందుఁగాక ! ఈ కృతి వ్రాఁతప్రతిలో హృదయంగమములగు నుపసంహారశ్లోకములు రెండు క్రింద నుదాహరింపఁబడుచున్నవి[60]. దీనిని బట్టి ప్రతాప

56. కాకతీయాంధ్రరాజయుగచరిత్రము (= ఆంధ్రులచరిత్రము 5 సంపు. 535 పు. 1936).

57. కాకతీయసంచిక-13. పు. (1935)-రాజమహేంద్రవరము.

58. అగస్త్యశబ్దసంగ్రహనిఘంటువు అగస్త్యవ్యాకరణోక్తశబ్దసంగ్రహ నిఘంటువు-ఇత్యాదిగా నామాంతరములు. (ఆర్ష ముద్రణాలయము, విశాఖపట్టణము.1895)

59. ఈ.వే.వి. రాఘవాచార్యుని రచన-'అగస్త్యుఁడు-బాలభారతము'-1935.

రుద్రీయ కర్త యగు విద్యానాథుఁడు నగస్త్యుఁడు నఖిన్నులే యను సిద్ధాంతము[61] మఱింత దృఢపడుచున్నది.

శిఖరిణీ : 'శ్రవశ్శ్లాఘ్యైః స్థూలంకరణభణితిగ్రన్థినిపుణైః
కపింమన్యైర్ణ్యస్తైః కిమహ బహురోమన్థహారిణైః ?
విమర్శ్యాదర్శ్యాన్తః ప్రతిఫలదలంకారరచనైః
అగస్త్యైః పౌరస్త్యానసుసరతి సూక్తిస్సుమనసః'

శిఖరిణీ : 'అనాదృత్యశ్లాఘ్యాః భువి కవినిబద్ధా నఖిరతిం
కృతేర్వైయాసిక్యాం రచయితు రగస్త్యస్య విదుషః,
వనస్త్రీవాగ్దేపి కృతిని రసనాగ్రే వితనుతే
న పర్యఙ్కే పఙ్కేరుహి మహతి శఙ్కే విహారణమ్.'

3. నలకీర్తికౌముది[62] : కలికల్మషాపహమగు నలుని పవిత్ర చరిత్ర భారత ప్రసిద్ధమైనదే. ఈ కథ నితివృత్తముగాఁ గైకొని శ్రీహర్షుఁడు విద్వ

---

60. The Descriptive Catalogue of Sanskrit Manuscripts (Tanjore) Vol. VIII p. 2994 (1930).

61. అగస్త్యవిద్యానాథుల యైక్యవాదము మొట్టమొదట 'మిథిక్-సొసైటీ-పత్రిక'. (Journal of The Mythic Society Vol. X 3339) లోఁ ప్రకటింపఁబడిన యాంగ్లవ్యాసమునఁ బ్రతిపాదింపఁ బడెను. ఈ వాదమును ఖండించుచు మఱియొక రావత్రికయందే వేఱొకవ్యాసమును బ్రచురించిరి. (Journal of the Mythic Society Vol. XI. P. 286-1931). కాని యైక్యవాదమే చరమసిద్ధాంతము కాక తప్పదని మదీయదృఢప్రత్యయము.

Vide also P. 12 (The article under *Agastya Pandita*)-Provisional Fasciculus, of *New Catalogus Catalogorum* (1937). Also *vide* Prof. P P. S. Sastri's remarks in Vol. VI, p. 2596 of the *D. C. Skt. Mss.* in the Saraswati Mahal Library. Tanjore (1929)—'*Agastya Pandita* is the author of this work (i. e. *Bala Bharata*). Scholars may be aware of the fact that he belonged to the Andhra country and that he was the famous author of the *Prataparudriya*. Vidyanatha seems to have been only a title conferred on him.'

62. ఇది ఖండకావ్య మనియు నిందు నాలుగు సర్గములు కల వనియు, నీప్రాఁత ప్రతి లండన్ నగరమున 'ఇండియా ఆఫీసుగ్రంథాలయము'న గల దనియు'న్యూక్యాటలాగస్-క్యాటలాగోరం' (*New Catalogus Catalogorum*). P. 12 Published by the Madras University, 1937) అనుకోశమునఁ గలదు.

దౌపద మను నైషధీయచరిత మను మహాకావ్యమును రచించెను. సాహిత్యదర్పణకారుఁడు సుధాప్రాయముగా నుడివినట్టికి నిది యాలంకారికుల కల్పిత దోషదుష్టముగాఁ గానవచ్చియుండుననియు నందువల్లనే ప్రాచీనాలంకారికుల తీవ్రవిమర్శనమున కిది గురియైయుండ నోపుననియు. దీనిఁ బురస్కరించుకొనియే ప్రసిద్ధ సాహిత్యవేత్తయగు నగస్త్యుఁడు నలకీర్తికౌముది యను మహాకావ్యమును రచించి యుండవనోపు ననియు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'నలకీర్తికౌముది' పీఠికలో వ్రాసియున్నారు. ఇది సరియే కావచ్చును. మఱియు నా కాలముననే సాహిత్యదర్పణకారునిచేఁ గూడఁ బ్రమాణముగా నెంచఁబడిన కృష్ణానందుఁ డను మహాకవి (క్రీ. శ. 13వ శతాబ్ది) సహచరితామృత మను 'సహృదయానంద' మను మహాకావ్యమున వైదర్భరీతిలో సంగ్రహించియున్నాఁడు. క్రీ. శ. 1400–1450 ప్రాంతమున వెలసిల్లిన వామనభట్టబాణుని 'నలాభ్యుదయము' గూడ నిటఁ బేర్కొనఁ దగును. నలకీర్తికౌముది మహాకావ్యమందున్నట్లు సర్గాంతముల నుండెడి 'ఇతి శ్రీ నలకీర్తికౌముద్యాఖ్యే లక్ష్మీపదలాఞ్ఛనే అగస్త్యకృతౌ మహాకావ్యే ద్వితీయస్సర్గః' గద్యము వలన తెలియుచున్నది.

ఈ కావ్యముత్సన్నకల్పమగుటచే నెందెన్ని సర్గములుండెనో తెలియదు; కాని 2వ, 4వ సర్గలు మాత్రము లభింప వానిని భూమికతో శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రివర్యులు ప్రకటించియుండిరి. భారవి కిరాతార్జునీయమునఁ బ్రతిసర్గాద్యంతములఁ 'శ్రీ లక్ష్మ' శబ్దమునుఁ బ్రయోగించి యుండుటచే నీ కవి ననుసరించిన మాఘుఁడు శిశుపాలవధ యందలి ప్రతిసర్గమున నాద్యంతములఁ 'శ్రీ' పదము ననుబంధించెను. ఇట్లే శ్రీ హర్షుని 'నైషధీయ చరితము' 'ఆనందపదాంకితము'; వీరనంది 'చంద్రప్రభ చరితము' 'ఉదయ' పదాంకితము. ఇట్లే నలకీర్తికౌముది యందుఁ బ్రతిసర్గమున 'లక్ష్మ' పదలాంఛన మనుసంధింపఁ బడెను[63].

వసుచరిత్ర రచింపఁబడు నాఁటికి (క్రీ. శ. 1600) నలకీర్తికౌముది పఠన పాఠన ప్రసిద్ధమగుటచేఁ గాఁబోలు నిందలి—

ఉపేంద్రవజ్ర : 'భృఙ్గానవాప్తి ప్రతిపన్నఖేదా
కృత్వా వనే గన్ధఫలీ తపోఽలమ్
తన్నాసికాభూ దమభూతగన్ధా
స్వపార్శ్వనేత్రీకృతభృఙ్గసేవ్యా' (2, 74)

63. కావ్యచిహ్నములఁ గూర్చి 'సంస్కృతసారస్వతచరితము-ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యములు'-అను నా వ్యాసమును చూచునది. (ఆం. సా. పరిషత్పత్రిక, 24 సంపు. 2 సంచిక. 68 పేజీ.)-1935.

5. అనేక రత్నాకరమేఖలా త్వం
తం సప్తరత్నాకర మేఖలాయాః
పతిం పతిం ప్రాప్నుహి పార్వతీవ
శివం శివం స్యాదుదుపార్ధ ఫాలే. (ii. 65)

6. స్నాతా ఘటోద్భవపరిముక్తపయోభి, రాప్త
క్షౌమేయకాశకుసుమా, లసదాస్యపద్మా,
అముక్తమౌక్తికవిభూషణసస్యపూర్ణా
భాతీవ భీమతనయా శరదుర్వ రేయమ్. (ii. 75)

7. తథా భూసురేభ్యో బహుభ్యశ్చ భైమీ
సురేభ్యో మహద్భ్యశ్చ నమస్కృత్య, వీక్ష్య,
సకాశే లసత్కాశనీకాశకాన్తిం,
ఘనానీలవేణీం వవన్దేఽథ వాణీమ్ (ii. 78)

8. సా మన్దస్మితతర్జితాతివిశదజ్యోత్స్నాస్ఫురచ్చారదా
భైమీం శారదపుణ్డరీక వదనాం విప్రౌఘవాక్సారదామ్,
తా మూచే శిరసాభివాదన పదాం మన్దస్మితాం శారదా
బాలే త్వా మభియాతు।సర్వజగతీసామ్రాజ్యలక్ష్మీః స్వయమ్.
(ii. 79)

(ఇతి శ్రీ నలకీర్తి కౌముద్యాఖ్యే లక్ష్మీపదలాఞ్ఛనే అగస్త్యకృతే మహాకావ్యే ద్వితీయస్సర్గః.)

9. యత్సౌధవాతాయనరన్ధ్రమార్గా
ద్గచ్ఛన్ శశీ నిత్య మభూ త్కళఙ్కీ,
తత్రత్యదీపాగ్రమషీవినీల-
మధ్యో. న పఙ్కా న్న శశా న్న చైణాత్. (iv. 11)

10. పౌరాః పురస్థోర్వ్యథ నలం నలాజై
రవాకిరన్ హర్మ్యగతాః ప్రసూనైః,
బిమ్బాత్మకై ర్విష్ణు మి వోర్మయాద్రి
మన్థాన సంక్షోభిత దుగ్ధ సింధోః. (iv. 24)

11. తమీ తమస్తాంతనస్త్రలోక పీడా
నక్రామస్వప్నృద్ధారకసున్దరీణామ్,
విలోలనాసామణిమౌక్తికేవ
నక్షత్రమాలాభ్యుదియాయ లోలా. (iv. 49)

12. ప్రాచీ పురన్ధ్రీముఖ మేవ దృష్ట్వా
విధు స్తమోనీల పటావకుణ్ఠమ్,
స్వకాన్తి కాశ్మీరపటీ రపిష్ట-
వపుష్టిం విచిక్షేప సహాస మేనామ్. (iv. 51)

13. కామం విలోక్యేవ గృహీతచాపం
వల్ల్యంగనా శ్లేష ముగు ర్మహీజాః
శాఖాభుజై, రప్యపిబ న్నళీనాం
ద్వన్ద్వాపి పౌష్పం మధు పత్రపాత్రే. (iv. 60)

14. ఆవ ర్తనాభ్యుల్లసజ్జకణ్ఠ
మహోత్పలానోల్లసత్పల పత్రనేత్రాః
శైవాలలోమాః స్ఫటికజాలనీలా-
లకా స్సరిద్వ ద్వ్యరుచ న్వధూటయః. (iv 61)

4 ప్రతాపరుద్రయశోభూషణము : దక్షిణభాగతవర్షమునం బఠనపాఠనములచే విశేషఖ్యాతి నందిన ఈ 'యలంకారశాస్త్ర సర్వస్వసంగ్రహము' కృతిపతి యగు ద్వితీయప్రతాపరుద్రునికీర్తి చంద్రికను చిరస్థాయినిగా నొనర్చినది. ఉపోద్ఘాతము (1–9 పు) కాక యిందుం దొమ్మిది ప్రకరణములుగలవు.

1. నాయకప్రకరణము.
2. కావ్యప్రకరణము,
3. నాటకప్రకరణము
నాటకోదాహరణము
(= ప్రతాపరుద్రకల్యాణము).
4. రసప్రకరణము
5 దోషప్రకరణము.
6. గుణప్రకరణము.
7. శబ్దాలంకారప్రకరణము.
8. అర్థాలంకారప్రకరణము.
9. మిశ్రాలంకారప్రకరణము.

యశోభూషణశాఖకు చెందిన సాహిత్యగ్రంథములకు 'ప్రతాపరుద్రయశోభూషణమే' యాదర్శభూతమగుకృతిరాజ మనందగును. ఈ గ్రంథమును గూర్చిన విపుల సమీక్ష రానున్న ప్రకరణమునం జూడ నగును.

6 మణిపరీక్ష (మణిలక్షణ)[69] : డాక్టర్ కృష్ణమాచార్యులవా రగస్త్యకృతులలో నీ గ్రంథమును గూడఁ జేర్చియున్నారు; కాని వారు ప్రమాణమును జూపియుండలేదు. మల్లినాథసూరి 'ఘంటాపథమున' (శాకుంతల వ్యాఖ్య

"కరిణాం ముక్తాయోనిత్వే ప్రమాణ మాహ అగస్త్యః—

'జీమూతకరిమత్స్యాహివంశశంఖవరాహజాః,

శుక్త్యుద్భవాశ్చ విజ్ఞేయా అష్టౌ మౌక్తికయోనయః' ఇతి"—

అని యుదాహరించినాఁడు. పై పద్య మగస్త్యుని 'మణిపరీక్ష' లోనిదే మో!

7. లక్ష్మీస్తోత్రము 8. లలితాసహస్రనామము 9. శివసంహిత

10. శివస్తవము (శివస్తుతి) 11. సకలాధికారము

పై నైదు గ్రంథములును అగస్త్యకృతము లని శ్రీకృష్ణమాచార్యుల వారు వ్రాయుచు నొక 'శివస్తవమున'కు మాత్రము ప్రమాణము నొసఁగి యున్నారు. అగస్త్యుఁడు సంస్కృతమున రచించిన 74 కృతులలోఁ బ్రకృతము తెలియ వచ్చినవి పై పదునొకండు మాత్రమే. ఇందును, కృష్ణచరితము, నలకీర్తి కౌముది. ప్రతాపరుద్రీయము, బాలభారతము మాత్రమే అగస్త్య రచితము లని నిశ్చితముగాఁ జెప్పవచ్చును. తక్కినవి యీ యగస్త్యుని రచనములే కావచ్చును. కాకపోవచ్చును. ఈ విషయమింకను జర్చనీయము.[70] మన కవి

---

69. రత్నపరీక్ష, నవరత్నలక్షణము. నవరత్నపరీక్ష. అగస్తీయరత్నపరీక్ష యను పేళ్ళతో నుండు కృతులును బై మణిపరీక్షయు నొక్కటే కావచ్చును. స్కాందపురాణాంతర్గతము (తృతీయభాగము) అగస్త్యసంహిత; ఈ సంహితలో నొకభాగము హాలాస్యమాహాత్మ్య మఁట- అగస్త్యకృత మనఁబడు రత్నపరీక్ష హాలాస్యమాహాత్మ్యమున నొక భాగ మఁట. (*New Catalogus Catalogorum*, Provisional Fasciculus P. 14.)

70. అగస్త్యునిరచనములుగాఁ బరశ్శతకృతులు తెలియుచున్నవి. ఇందు అగస్త్య పండితుని రచనము లేవైన మున్నచో నెన్నియో, యేవియో, నిశ్చయముగాఁ జెప్పలేము. వానిలోఁ గొన్ని; అగస్త్యవాస్తుశాస్త్రము, అగస్త్యవ్యాకరణము, అగస్త్యసంహిత, అగస్త్యాష్టకము (= శివాష్టకము), గణపతిస్తోత్రము, దశావతారస్తోత్రము, వేదపాదస్తవము, శబ్దసంగ్రహ నిఘంటువు (= అగస్త్య వ్యాకరణనిఘంటువు = అగస్తీయవ్యాకరణోక్త శ. స. ని.) సకలాధికారము, (శిల్పము); సరస్వతీస్తోత్రము.

సకలాధికారమున అగస్త్యశిల్పశాస్త్ర మొకభాగముగాఁ గానవచ్చుచున్నది. అజ్ఞాతకర్తృక మగు 'శిల్పసంగ్రహ' మను గ్రంథమున నీసకలాధికారమునుండి యనేక భాగములు సంగ్రహింపఁ బడియున్నవఁట. అగస్త్యరచితము లగు గ్రంథము లనుగూర్చిన విశేషములు సంగ్రహముగా సంస్కృతగ్రంథ గ్రంథకర్తృసూచికయందు కానఁగును. (*N C C* Vol. I. P. P. 16 to 28)

రచించిన 74 కృతి రత్నములలోఁ బైనాలుగు మాత్రమే జీవించి యుండుట సంస్కృత వాఙ్మయమునకొక గొప్ప లోటని చెప్పకతప్పదు. ప్రాప్తిమత్ప్రసన్న కల్పములుగా నెంచఁబడు నగస్త్యుని కృతిరత్నము లెన్నఁటికైన బయలుపడి, సహృదయానందముఁ గల్గించుఁ గాక !

'న్యూ కేటలోగస్ కేటలోగోరమ్' అను సంస్కృత గ్రంథ గ్రంథకార సూచి యందు అగస్త్యుని పేర ననేక గ్రంథములు[71] సూచింపఁ బడి యున్నవి వీనిలో అగస్త్యమహర్షి కృతము లెన్నియో, విద్యానాథ బిరుదాలంకృతుఁ డగు అగస్త్య మహాకవి రచితము లెన్నియో నిశ్చయించుట కష్ట సాధ్యము.

8. ప్రతాపరుద్రయశోభూషణము :

## 1. సింహావలోకనము

శ్లో. పుణ్యశ్లోకగుణోక్తి శాణకషణా దుత్తేజనాం లంఛితం
సంజగ్రాహ రసాదిరత్న నిచయం విద్యాధినాథః పురా.'

—కుమారస్వామి రత్నాపణము (7. ప.)

సంస్కృత సాహిత్య ప్రపంచమునఁ బ్రత్యేక ప్రస్థానప్రచారకము లగు ధ్వన్యాలోకము, వక్రోక్తి జీవితము, ఔచిత్యవిచారచర్చ, వ్యక్తివివేకము, చమత్కార చంద్రిక, రసగంగాధరము మొదలగు గ్రంథములకుఁ దీటుగ పేర్కొనఁదగినది, సాహిత్యరత్నాపణ మనఁదగినది విద్యానాథుని 'ప్రతాపరుద్రీయ' మను నామాంతరముగల 'ప్రతాపరుద్రయశోభూషణము.' సంస్కృత భాషలో సాహిత్యగ్రంథములు రచించిన యాంధ్రులలో విద్యానాథుఁడే సర్వథా ప్రప్రథముఁ డనుటలో విప్రతిపత్తి యేమియు నుండదు. ఉదాహరణ నాటకముతోఁ గూడ సాహిత్యవిషయములను విపులముగ, విశదముగఁ, జర్చించు వానిలో నిది యుత్తమ కృతిరత్నము. కృతికర్త ఆంధ్రచక్రవర్తి; కృతికర్త ఆంధ్రుఁడగు నాలంకారిక శిరోమణి, వ్యాఖ్యాతలు పండితప్రకాండులు, ఆంధ్రులునగు కోలాచల కుమారస్వామిసోమయాజి. చిలకమర్తి తిరుమలాచార్యులు. ఇదియొక యపూర్వము. విచిత్రమునగు సంఘటనము. ఆంధ్రసార్వభౌమునికీర్తికౌముది యాంధ్రకవిశేఖరునియమల వాఙ్మయాదర్శమునఁ బ్రతిబింబించి, యాంధ్రదేశమునకు నజరామరమగు ప్రతిష్ఠను కలిగించినది. ప్రత్యణువున నాంధ్రత్వము తొణికిసలాడు నీ గ్రంథరాజ మాంధ్రజాతి యొక్క యుదాత్తసంస్కృతి విశేషములను ముక్తకంఠమున నుద్ఘోషించుచుఁ గేవల

71. Vide-*New Catalogus Catalogorum*. Vol. I. P. P. 16 to 23. (1949)

సాహిత్యగ్రంథ ప్రాధాన్యము నేకాక, ఐతిహాసిక ప్రాముఖ్యమును గూడ వహించి శిరోధార్యమగుచున్నది.

విద్యానాథునికిఁ బూర్వమే యనేక సాహిత్య గ్రంథములు వెలసినవి. కాని యందేవియు నాయక గుణకీర్తన నిబంధనములు కావు. ప్రబంధోత్కర్షక దాత్తనాయకగుణప్రశంస నిదానము. ప్రాచీనాలంకార గ్రంథములయందలి యీ లోపమును గనిపట్టి, విద్యానాథుఁడు తన సాహిత్యకృతికల్పలతకు మహామహులగు ప్రతాపరుద్రుని మహత్త్వ కీర్తనమునే యాలంబనమ్ముగా నొనర్చెను. ప్రాచీనకవులలోఁ గొందఱు తమ గ్రంథములను నరాంకితములుగా నొనర్చుట పాతకముగా నెంచుచుండెడివారు కాని 'నా విష్ణుః పృథివీపతిః' అను సూక్తి ననుసరించి, నాయక ప్రకరణోపోద్ఘాతమున నుదాహృతములగు దండి భామహోద్భట, రుద్రట, భోజాచార్యుల ప్రమాణముల నంగీకరించి, విద్యానాథుఁడు తన కృతిని ప్రతాపరుద్రయశస్సౌరభసురభిళముగా నొనరించెను. నాటకోదాహరణమున నీ విషయము కంఠోక్తిగాఁ జెప్పఁబడెను.

'విష్ణోరవతారః ఖల్వయం వీరరుద్రో ప్యచింత్యమహిమా'
—ప్ర. రు. య. భూ. 112 పు. మైలాపూరుప్రతి (1914)

'కలికాలదోషశిథిలధర్మప్రతిష్ఠా నిర్వోఢుం, నోఢుం చ మహతీం
మహీధుర మవతీర్ణస్య కాకతీయ విష్ణోస్తవ' (114 పు. పై ప్రతియే)

వ్యాసమహర్షి కాలమునుండియు కావ్యమున మానవగుణకీర్తనము నికృష్టముగా నెంచఁబడుచుండెను. ఆ మహర్షియే

శ్లో. అసత్కీర్తనకాంతారపరివర్తనపాంసులామ్,
వాచం శౌరికథావగఙ్గయైవ పునీమహే.

అని, మహాభారత రచనానంతరము నుడివి, హరివంశమున కుద్యమించె నఁట, ఇట్టి మనఃప్రవృత్తిగల వారణాసి ధర్మసూరి కూడ తాను రచించిన సాహిత్యరత్నాకరమున విద్యానాథుని పేరైన నెత్తక మానవమాత్రుఁడగు ప్రతాపరుద్రునకు తన రచనమును కృతి యిచ్చిన కుక్షింభరి యని యాతనిని వ్యంగ్యముగా నెత్తిపొడిచి, తన కృతిని నరాంకితము చేయక, శ్రీరామచంద్ర యశోఘనసార సౌరభసమ్మిశ్రితముగా నొనర్చినాఁడు. ధర్మసూరి నొల్లింతన వాక్యము లిటఁ జూపఁబడుచున్నవి:

శ్లో. 'అలంక్రియాః పూర్వతరైః ప్రణీతాః
న యోజితాః కాశ్చన నాయకేన,
కైశ్చిత్తు కుక్షింభరిభిర్నిబద్ధాః
క్షోదీయసా కాఞ్చన నాయకేన.' (సా. ర. I-పు. 1౮)[71]

మహాకవి వేంకటాధ్వరి—

శ్లో. 'రసనాం దుర్జనాశ్లేషానవర్ణనాపఙ్కదూషితామ్,
శ్రుత్యంతదేశికస్తోత్రసుధాభిః శోధయామ్యహమ్.'[72]

శ్లో. 'మదాంధక్షోణీపత్యపశదమనః ప్రీణనకృతే,
సమస్తాకారాన్ బ్రూమః' —(లక్ష్మీసహస్రమ్ I. ౫)[73]

అని, ప్రభుప్రశంసను దూషించి, శ్రీమహాలక్ష్మీ స్తోత్రమును రచించి, స్వజిహ్వాసంక్రాన్త మాలిన్యమును శోధించెను. మనుజేశ్వరాధములకు తన రచనలను కృతిగా నొసంగుటకేగాక, వారొసంగు సన్మానధనమును గైకొనుటకుఁ గాని యంగీకరింపని మహాభాగవతాగ్రేసరుఁడగు బమ్మెర పోతనయు నీ కోవకుఁ జెందినవాఁడేగదా!

విద్యానాథుఁడు కుక్షింభరియై యుదాత్తమగు తన కవితాకన్యను కూళలకంటఁ గట్టినవాఁడు కాఁడు సరసుఁడు, సుగుణపుంజమై, కళాపోషకుఁడై, స్వయముగా విద్వత్కవియై జనరంజకుఁడని వాసిగాంచిన ప్రభువతంసుని తన సాహిత్య ప్రబంధమునకు నాయకునిగాఁ జేసికొనిన గుణపక్షపాతి, ఆంధ్రుల కీర్తి వైభవముల నజరామర మొనర్చిన మహామహుఁడు. గావున ధర్మసూరి నిరూపించిన దోషపఙ్క్తము విద్యానాథుని కెంత మాత్రము నంటఁ జాలదు.

ఈ తొమ్మిది ప్రకరణములు గల ప్రతాపరుద్రీయము కారికలు, వృత్తి, ఉదాహరణ శ్లోకములు అని మూఁడు భాగములుగ నున్నది. ఈగ్రంథమున మొత్తము కారికలు ౩౮౦. ఉదాహరణ పద్యములు ౫౮౮. వీనిలో ౮౨ ప్రాకృత పద్యములు. ఉదాహరణ పద్యములయందు, రెండుసారులో మూఁడుసారులో

71. సరస్వతీనిలయముద్రాక్షరశాల, చెన్నపురము. (1871)

72. 'ఆచార్యపంచాశత్'-(వేదాంతదేశికస్తోత్రజాలం-సరస్వతీనిలయ ముద్రాక్షరశాల, చెన్నపురము. (1877)

73. భారతీవిలాసముద్రాక్షరశాల, కార్వేటనగరము (1890)

యావృత్తినొందిన పద్యములు 35. ఈ యావృత్త పద్యముల సూచిక 12 వ అనుబంధమునఁ జూపఁబడినవి.

ప్రబంధ గౌరవమునకు ప్రధాన నిదానమగుటచే నాయక స్వరూప నిరూపణముతో నీ గ్రంథ ముపక్రాంతమై క్రమముగాఁ గావ్యస్వరూప చిత్రణము, అందు విలక్షణమగు రూపక సమాలోచనము, ఉదాహరణ నాటకము, కావ్యశ్రీకి జీవితమగు రసధ్వని సమాలోచనము, కావ్యాపకర్షకములగు దోషముల వివేచనము, కావ్యోపస్కారకములగు వృత్తి - రీతి - గుణాలంకారముల సమీక్షయునను సముచిత వ్యవస్థతో నీ కృతి నిర్వహింపఁబడినది. విద్యానాథుఁడు తననాఁటి వఱకును వెలసిన ప్రాచీన సంస్కృత సాహిత్యాచార్యుల సిద్ధాంతముల సారము నేక ముఖముగ నొనర్చి, తన గ్రంథమునకు 'అలంకారశాస్త్ర సర్వస్వసంగ్రహము' అను నభిధేయమును సార్థక మొనర్చి, సాహిత్య పిపాసువులకు మహోపకారము చేసెను. ప్రధాన విషయములను విస్మరింపక అపేక్షితముల విస్తరింపక లలిత సరణిని నిర్మింపఁబడిన యీ కృతి సాహిత్యవిద్యాముఖమునకు ఘంటాపథమై వెలయుచున్నది ఈ కృతి దర్పణమునకు ప్రతాపరుద్ర చక్రవర్తి చరిత్ర కళాయువంటిది. ఒక్క దోష ప్రకరణమునఁ దక్క మిగిలిన ప్రకరణములయందన్నిటను ప్రతాపరుద్రుని గుణకీర్తనమే కానవచ్చును. శాసనాద్యాధారములవలనఁ దెలియనగు ననేక చారిత్రకాంశముల నీ గ్రంథము దృఢపఱచుచున్నది. ఇట్లు బహుగుణ గుంఫితమగుటచేతనే యీ సాహిత్య నిబంధనము భారత వర్షమున, అందు ముఖ్యముగ దక్షిణ భారతదేశమున నైదాఱు శతాబ్దముల నుండి పాఠ ప్రవచనములచే ప్రచుర ప్రచారము నందినది.

కవికోకిలముల యొక్కయుఁ బ్రభుకల్పకముల యొక్కయు యశస్సు పరస్పరాశ్రితము, వాల్మీకి మూలమున శ్రీరామునికీర్తి స్థిరత్వము నొందెననుచో శ్రీరామచంద్రుని వంటి లోకోత్తరుని కథాసుధా సంపర్కముచే వాల్మీకియుఁ దక్కన ఋషులవలెఁగాక, పూలతోడి దారమువలె, విశిష్ట గౌరవము నందినాఁడు. మణిచేఁ గంకణమును, కంకణముచే మణియు, నీరెంటిచేతను హస్తమును బ్రకాశించునట్లు, కవివలన రాజును రాజువలనఁ గవియు నీ యిరువురి వలన సభయుఁ బ్రకాశించునుగదా[74] రాజుకీర్తియుఁ దదాశ్రితుఁ

74. 'కవినా చ విభు ర్విభునా చ కవిః. కవినా విభునా చ విభాతి సభా, మణినా వలయం వలయేన మణిః, ర్మణినా వలయేన విభాతి కరః.'

డగు కవికీర్తియుఁ బరస్పరాశ్రితములని మహాకవి బిల్హణుఁడు చెప్పిన సూక్తి[75] యెంతయు సమంజసము. సచ్చరిత్రుఁడగు ప్రతాపరుద్రునకును, లోకోత్తర మహోత్తరుఁడగు నీ మహనీయుని గుణగణాభివర్ణనము వలన ప్రతాపరుద్రీయమునకును ఉపస్కారోపస్కారక భావముగలదని విద్యానాథుఁడును వ్రాసియున్నాఁడు:

'కాకతీయ నరేంద్రస్య యశో భూషయితుం కృతా
విద్యానాథకృతి శ్చేయం స్వయం తేన విభూష్యతే.'
(I. ప్ర. 10 ప.)

కేవలము సాహిత్య గ్రంథముగానే కాక, ప్రతాపరుద్రీయమున కైతిహాసిక ప్రాధాన్యమునకుఁ దోడు కవితా ప్రాముఖ్యము గూడఁ గలదు. విద్యానాథుఁడు మహాకవియే కాక పద్యరచనమునఁ గూడ సిద్ధహస్తుఁడు. ఈతని పద్యరచన యెచ్చటను కుంటుపడక ధారావాహికముగాఁ బ్రవహించుచుండును. భట్టబాణుఁడు, బాణుఁడు మహాకవియైనను పద్యనిర్మాణమున నారితేలినవాఁడు కాఁడను సంగతి పండితు లెఱింగినదే. విద్యానాథుఁ డుదాహరణములుగా రచించిన శ్లోకములు సరస పాదరసమువలెఁ బ్రవహించుచు, అమరుక మహాకవి ముక్తకములవలె హృదయంగమములుగా వెలసిల్లును.

'నాటకాన్తం హి సాహిత్య'మ్మను సూక్తిచేఁ బఠనమునకుఁగాని, రచనమునకుఁ గాని నాటకము పైమెట్టు. కవి ప్రజ్ఞాద్యోతకమగు నిట్టి నాటకరచన

---

75. (అ) 'కిం చారుచారిత్రవిలాసశూన్యాః కుర్వన్తి భూపాః కవిసంగ్రహేణ,
కిం జాతు గుంజాఫలభూషణానాం, సువర్ణకారేణ వనేచరాణాం.
(ఆ) పృథ్వీపతేః సన్తి న యస్య పార్శ్వే కవీశ్వరాస్తస్య కుతో యశాంసి?
భూపాః కియన్తో నబభూవు రుర్వ్యాం. జానాతి నామాపి న కోఽపి తేషాం.
(ఇ) లంకాపతేః సంకుచితం యశో యద్ యత్కీర్తిపాత్రం రఘురాజపుత్రః.
స సర్వ ఏ వాదికవేః ప్రభావః న కోపనీయాః కవయః క్షితీన్ద్రైః,
(ఈ) గిరాం ప్రవృత్తి ర్మమ నీరసాపి మాన్యా భవిత్రీ నృపతే శ్చరిత్రైః.
కే వా న శుష్కాం మృద మత్ర సిన్ధుసంబంధినీం మూర్ధని ధారయన్తి'?
(వి. దే. చ. I. 25, 26, 27, 28.)

మునకుఁ గూడ విద్యానాథుఁడు కృతహస్తుఁడని ప్రతాపరుద్రీయము నందలి 'ప్రతాపరుద్ర కల్యాణ'[76]మను నాటకము వలనఁ దెలియుచున్నది.

1. కల్యాణస్వప్నము
2. వీరరుద్ర విజయము
3. వసంతయాత్రా విలాసము
4. త్రైపురిక మహోత్సవము
5. ప్రతాపరుద్ర రాజ్యాభిషేకము.

అను నైదంకములు గలవు. ఇం దితివృత్తము మాత్ర మత్యల్పము

విద్యానాథు ననుసరించి నవీనులు రచించిన యశోభూషణ గ్రంథములలో రెండింటిలో పూర్వోక్త నాటకోదాహరణ విశేషము కన్పట్టుచున్నది

**1. నరసింహకవి - నంజరాజ యశోభూషణము[77] (క్రీ.శ. 1750):** మైసూరు రాజ్యాధికారి యుద్ధప్రధాన సాహిత్యోద్ధారకుఁడగు నంజరాజు కీర్తిని వర్ణించు నీ కృతిలో షష్ఠ ప్రకరణము నాటక విచారము. ఈ ప్రకరణమున నైదంకములు గల 'చంద్రకళా కల్యాణ'మను రూపక ముదాహరణముగా రచింపఁ బడినది

**2. సదాశివమఖి-రామవర్మ యశోభూషణము[78] (క్రీ.శ. 1758-98):** తిరువాన్కూరు ప్రభువగు రామవర్మ కులశేఖరుని పాలనలో నధికరించి రచింపఁబడిన యీ కృతి నరసింహకవి గ్రంథమునకు సమకాలికమే యనఁదగును. ఇందు నాటక ప్రకరణమున వసులక్ష్మీ రామవర్మల పరిణయ మితివృత్తముగాఁ గల 'వసులక్ష్మీ కల్యాణ'మను రూపక ముదాహరణముగా నిర్మింపఁబడెను.

సంస్కృత సాహిత్య గ్రంథములలో సర్వసాధారణముగా సాహిత్య విషయములే చర్చింపఁబడును: వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిలో

---

76. కాకినాడ వాస్తవ్యులు కీ. శే. 'శృంగారకవి' సర్వారాయఁడుగారు దీనిని 'ప్రతాపరుద్రీయ' మను పేరతోఁ జిరకాలము క్రిందటనే తెలిఁగించి, 19వ సంవత్సరమున ముద్రించినట్లు తెలిసినది. కాని వీరి, యనువాదము నాకు లభింపలేదు. ఇట్లే యీ యుదాహరణనాటకమును శ్రీ శేషాద్రిరమణకవులు కూడఁ దెలిఁగించినట్లు తెలియవచ్చెడివి.

77. G. O. S. No. 47 Baroda (1930). Vide-Pro. Baladeva Upadhyaya's paper : *Royal Patronage and Sanskrit Poetics'* —(Pp. 17-19. *The Poona Orientalist.* Val. I No. 2 July. 1936).

78. Dr. M. K. Acharya's *H. C L.* S. pages. 302 - : 1937.

'అంభోజపత్రాయతలోచనావా
మంభోధిదీర్ఘా స్వివహ దీర్ఘికాసు ;
సమాగతానాం కుటిలై రపాఙ్గై
రనంగబాణైః ప్రహతా యువానః'.

అను రెండు పద్యములు ఏకశిలావర్ణనాత్మకములు, కాళిదాసరచనము లుగా భోజప్రబంధమునఁ[79] గన్పట్టుచున్నవి. ఈ గ్రంథము సంకలనకృతి యని వాఙ్మయ విమర్శకు లంగీకరించిన విషయమే. కావున ఇవి యేకవి యేసందర్భమున నేకాలమున రచించెనో చెప్పఁజాలము ఇవి యేకాకతీయశాసనములలో నైనను గలవో, లేక యివి కూడ విద్యానాథకృతములో తెలియదు.

ప్రతాపరుద్రచక్రవర్తి మహమ్మదీయప్రభువుచే బందీకృతుఁడైనప్పుడు అగస్త్యవిద్వత్కవి తాను రచించిన ప్రతాపరుద్రీయము నాతని సన్నిధికిఁగొని పోవుట పరతంత్రుఁ డగుటచే ప్రభు వేమియు సమ్మానరూపమున నొసంగలేక, తన ముద్రాంగుళీయకమును, విద్యానాథ బిరుదము నాతనికి నొసఁగుట ఇత్యాది కథ సిద్ధేశ్వర చరిత్రమునఁ[80] గలదు. ఈ వృత్తాంతమును విపులముగా నేలుఁ గఁగోరువారు 'కాకతీయసంచిక'ను (80 పుట) పరిశీలింపఁ దగును.

## 2. ప్రతాపరుద్రీయమునందలి ప్రాకృతగాథలు

ప్రాచీనకాలమునుండియు సంస్కృతకవులు పాకృతభాషలయందుఁ గూడ వ్యుత్పత్తిని సంపాదించెడివారు. సంస్కృతరూపకములయందు కొందఱు పాత్ర ధారులు—స్త్రీలు సేవకులు మొదలగువారు—ప్రాకృతభాషలనే వాడవలె ననులాక్షణికానుశాసనము కలదు. గ్రంథ మంతయు పాకృతభాషయందే రచించుట యొక విశిష్టప్రజ్ఞగా భావింపఁబడు చుండెడిది. రాజశేఖరుని కర్పూరమంజరి, వేదాంత దేశికులవారి 'అచ్యుతశతకము' ఇట్టి ప్రాకృతకవితానిర్మాణ కౌశలప్రదర్శకములే. రాజశేఖరుఁడు ప్రాకృతభాషాప్రాశస్త్యము నిట్లు ప్రశంసించి యున్నాఁడు.

---

79. 62-68. పు. (277-278 పద్యా- నిర్ణయ. ముద్రా. (1962).

80. కాసె సర్వప్ప 'సిద్ధేశ్వరచరిత్రము'. పుట 170. దీనికి ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము ఎం. ఏ. గారి ఆంగ్ల భూమికను (పుట 85) చూడఁదగును.

'పరుషాః సంస్కృతగుంఫాః,
ప్రాకృతగుంఫోఽపి భవతి సుకుమారః,
పురుషమహిళానాం యావ-
దిహాంతరం తేషు తావత్'. (ఛాయ. కర్పూరమంజరి I.).

ప్రతాపరుద్రీయమున ఆ యా ప్రకరణములయందు కన్పట్టువిద్యానాథ కృతప్రాకృతగాథల సంఖ్య మొత్తము 63. అవి యిట్లు జూపఁబడు చున్నవి.

| | |
|---|---|
| i. ప్రకరణము 8 గాథలు | iv ప్రకరణము 33 గాథలు |
| ii. ప్రకరణము 7 గాథలు | v. ప్రకరణము 1 గాథ |
| iii. ప్రకరణము 5 గాథలు | vi. ప్రకరణము 9 గాథలు |

పై సూచికను బట్టి విద్యానాథుఁడు సంస్కృత కావ్యరచనమునందేకాక ప్రాకృతపద్యనిర్మాణమునందుఁ గూడ కృతహస్తుఁ డని తెలియుచున్నది పైని సూచింపఁబడిన ప్రాకృతపద్యములయం దొకటి (ప్రథమప్రకరణోదాహృతము) ప్రవరసేనుని "సేతుబంధ" మను ప్రాకృతకావ్యములోనిది.

## 3. విద్యానాథునిపై ప్రాచీనసాహిత్య గ్రంథరచయితల ప్రభావము

ఉత్తమ కావ్యనిర్మాణ కౌశలము, నిశితవిమర్శన పాటవమ్మును నొక్క వ్యక్తియందే యెక్కడనో కాని కానరావు. ధ్వనియుగమునకుఁ బూర్వకాలికు లగునట్టి ప్రతిభామూర్తులు భామహుఁడు, దండి, ఉద్భటుఁడు అనువారు ముగ్గురు, ధ్వని యుగమున ఆనందవర్ధనుఁడు, అభినవగుప్తుఁడు, రాజశేఖరుఁడు, అను ముగ్గురు నిట్టివారే. ధ్వనియుగమునకుఁ దరువాత నట్టిధిషణాసంపన్ను లేడుగురు : క్షేమేంద్రుఁడు, విద్యానాథుఁడు, విద్యాధరుఁడు, విశ్వనాథకవిరాజు, ధర్మసూరి, అప్పయ్యదీక్షితులు, జగన్నాథపండితరాయలు.

విద్యానాథుఁడు తననాఁటివఱకును వెలసిన ప్రాచీనసాహిత్యాచార్యుల సిద్ధాంతములసారము నంతయు నేకముఖముగ నొనర్చి, తనగ్రంథమునకు 'అలంకారశాస్త్ర సర్వస్వసంగ్రహము' అను నామమును సార్థక మొనరించెను. ప్రాచీనాలంకారికుల గ్రంథముల నన్నిటిని మథించి రచింపఁబడినను, సాహిత్య

ప్రపంచమున మూర్తిత్రయవలన నొక్కఁడగు మమ్మటుని 'కావ్యప్రకాశము'ను ప్రధానముగా నుజ్జీవించుకొని విద్యానాథుడు ప్రతాపరుద్రీయమును నిర్మించెను.

కాని యలంకారవిషయమున నీతని యుపజీవ్యగ్రంథము రాజానక రుయ్యకుని 'అలంకారసర్వస్వము'; కావ్యప్రకాశకారుఁడు వదలివేసిన నాలుగలంకారములను (పరిణామము, ఉల్లేఖము, విచిత్రము, వికల్పము) విద్యానాథుడు స్వీకరించెను. విద్యానాథుని వికల్పాలంకారలక్షణము కొంచెము మించుమించుగా చంద్రాలోకములోనిదే యనవచ్చును. కావ్యగుణములను వివరించుసందర్భమున నీతఁడు భోజుని 'సరస్వతీకంఠాభరణము' ననుసరించెను.

## 4. అర్వాచీనసాహిత్య గ్రంథములపై విద్యానాథుని ప్రభావము

పూర్వప్రకరణమున విద్యానాథునిపై తత్పూర్వసాహిత్య గ్రంథకర్తల ప్రభావ మెంతవఱకుఁ గలదో దిఙ్మాత్రముగఁ జెప్పఁబడినది. అతని ప్రభావము నాటి నుండి యీయిరువదవ శతాబ్దివఱకు నెంతవఱకుఁ బ్రసరించినదో VIIవ యనుబంధమునఁ గల పంచాశదధికయశోభూషణ రచనముల నామములను బట్టి విశదమగును. ఈ రచనల కన్నిటికిని మార్గదర్శి విద్యానాథుఁడే కదా? మఱియు ప్రతాపరుద్రీయము బయలుదేఱినతర్వాత రచింపఁబడిన యెన్నో సాహిత్యగ్రంథములపై విద్యానాథుని ప్రభావము పడినది. ప్రతాపరుద్రీయమునకు నృసింహభూపాలీయ-నరసభూపాలీయములకును (1-2) జన్యజనకభావము లేకపోయినను, బింబప్రతిబింబభావముకలదని యీప్రకరణముననే VIవ భాగమున నిరూపితమగును. విద్యానాథుని కృతి ననుసరించిన పరకాలిక సాహిత్య రచనలయందు ముఖ్యమైనది అజితసేనుండను జైనకవి రచించిన (2) 'అలంకారచింతామణి'[81] (క్రీ. శ. 1420). కాలమును బట్టి అజితసేనుఁడు విద్యానాథుని కంటె నత్యంత సన్నిహితుఁడగు నర్వాచీనుఁడు. ఇదియు యశోభూషణశాఖకుఁ జెందినదే. అలంకారచింతామణి ప్రతాపరుద్రీయమునుండి గ్రహించినవిషయము లీక్రింది ప్రస్ఫుటసామ్యములనుబట్టి విశదమగును.

---

81. Vide Dr. K. Krishnamoorthy's article : 'The Date of Ajitasena's 'Alankara Chintamani' (*Journal of the Karnatak University*-Humanities-Vol. IV pp. 178-182. for June, 1960).

3. న్యూనాధిక పదరహితమగు ఉపమ :

| | |
|---|---|
| 'ఉదన్వా నివ గంభీరః | 'సముద్ర ఇవ గంభీరః |
| సువర్ణాద్రి రివోన్నతః, | సుమేరు రివ సూన్నతః |
| దిఙ్మహేభ ఇవ క్షోణీ | దిగ్దన్తీవ చ సర్వం ఖణ్డ |
| ధారేయః కాకతీశ్వరః.' (30పు.) | ధారేయో భగ తేశ్వరః' (పు.55) |

4. శయ్యాలక్షణము :

| | |
|---|---|
| 'యా పదానాం పరాన్యోన్య | 'పదానుగుణ్యరూపా యా |
| మైత్రీ శయ్యేతి కథ్యతే' (58పు.) | మైత్రీ శయ్యేతి కథ్యతే'.(పు 116) |

5. ద్రాక్షాపాకలక్షణము :

| | |
|---|---|
| 'ద్రాక్షాపాకః స కథితో | ద్రాక్షాపాకః స భణ్యేత |
| బహిర న్తః స్ఫురద్రసః' (59. పు.) | ఆవ్యోర్భ్య న్తః స్ఫురద్రసః'(117పు.) |

6. అజహల్లక్షణోదాహరణము :

| | |
|---|---|
| 'పత్యుః కాకతినాథస్య | 'పురోః సమవసత్యన్త |
| పాదపీఠీ మనారతమ్, | రాత్రితం సింహవిష్టరమ్, |
| స్ఫురద్రత్న ప్రభాజాలై | అలంచక్రుః కిరీటాని |
| రలఙ్కుర్వ న్తిమౌలయః' (44పు.) | నానారత్న మరీచిభిః. |

7. మఱియు విద్యానాథుని కవికావ్యనామము లుగల చక్రబంధ పద్యమును గూడ అజితసేనుఁ డనుకరించెను.

ఇఁకఁ బ్రతాపరుద్రీయము ననుసరించిన మఱికొన్ని రచనలు :

(4) అలంకార సంగ్రహము : కవిపేరు తెలియదు ప్రతాపరుద్రీయము నందలి యంశముల ననేకముల నీకవి క్రోడీకరించుకొనెను.

(5) అలంకారకౌస్తుభము : కవి విశ్వేశ్వరుఁడు; అప్పయదీక్షితులు విద్యానాథుని కొన్ని లక్షణములను ఖండింపఁగా, విశ్వేశ్వరుఁ డా దీక్షితులవారి యాక్షేపములను ప్రత్యాఖ్యాన మొనర్చి, విద్యానాథుని సమర్థించెను.

(6-7) నంజరాజయశోభూషణమున నరసింహకవియు, రామవర్మ యశోభూషణమున సదాశివమఖియు నెంతవఱకు ప్రతాపరుద్రీయము ననుకరించు కొనిరో 8-(1) ప్రకరణమునఁ దెలుపఁబడియేయున్నది.

(8). కర్తృనామము తెలియని 'అలంకార సర్వస్వ'[84]మను గ్రంథమున నించుకు సూత్రములతో ప్రతాపరుద్రీయము నందలి యంశములే యనేకములు స్వీకృతములు.

(9) అలంకార విచారము: కవి పేరు తెలియదు. ఇందును ప్రతాపరుద్రీయము నందలి విషయములు స్వీకరింపఁబడెను.

(10) అలంకారేందు శేఖరము: వేంకటనృసింహకవి; ఈ గ్రంథము ప్రతాపరుద్రీయము నుజ్జీవించుకొని రచింపఁబడెను.

(11) కవి సమయకల్లోలము (అనంతాచార్య కృతము): ప్రతాపరుద్రీయమును ప్రమాణీకరించుకొనెను.

(12) కర్తృనామము తెలియని 'రసికరసాయనము'న ప్రతాపరుద్రీయము ల్లేఖించుకొనఁబడెను. (సర్వాలంకార సంగ్రహమని రసిక రసాయనమునకు నామాంతరము).

(13) 'మందారమరందచంపువు'న[85] శేషము కృష్ణకవి పాకమును గూర్చిన చర్చనంతయు ప్రతాపరుద్రీయము నుండియే యుద్ధరించుకొనెను.

(14) కామధేనువు: గోపేంద్ర (=తిప్ప) త్రిపురహరభూపాలుఁడు వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిపై రచించిన వ్యాఖ్య. ఇందు ప్రతాపరుద్రీయము ప్రమాణీకరించుకొనఁబడెను. విజయనగర రాజాధీశ్వరుఁడగు రెండవ దేవరాయల క్రింద (క్రీ. శ. 1423-46) తిప్పభూపాలుఁడు రాష్ట్రపాలకుఁడుగా (గవర్నర్) ఉండెడివాఁడు.

(15) మల్లినాథుఁడు రచించిన వ్యాఖ్యలయందును ప్రతాపరుద్రీయము నామోల్లేఖన రహితముగ బహువారము ప్రమాణీకరించుకొనఁబడెను.[86]

మేఘసందేశ వ్యాఖ్యయందు—5 తడవలు. భట్టి కావ్యవ్యాఖ్యలో 30 పర్యాయములు. కుమారసంభవ వ్యాఖ్యలో 8 సారులు. మాఘవ్యాఖ్యలో 50 సారులు.

---

84. ఇది రుయ్యకుని 'అలంకారసర్వస్వము' కంటె భిన్నము.

85. కావ్యమాలలోఁ బ్రకటితము, బొంబాయి.

చూ-త్రివేది పండితుని 'ప్ర. రు. య. భూషణ' భూమిక (పు. IX-X)

(16) ధర్మసూరి 'సాహిత్య రత్నాకరము'న విద్యానాథుని ప్రతాపరుద్రీయమును రెండుమారులు ఉల్లేఖించుకొనెను.[87]

ఆంధ్రసాహిత్య గ్రంథములలో విద్యానాథుని ప్రభావము. 'నరస భూపాలీయము' మీదనే కాక ఇంకను తెలుగు రచనలయందు ప్రతిఫలించుచున్నది.

## ౫. ప్రతాపరుద్రయశోభూషణము వ్యాఖ్యలు

1. రత్నాపణము :

'శక్తి ర్వాచాం రచయితు మలం శ్రోతు మేవాపర స్తాం
కల్యాణీ తే మతి రుభయథా విస్మయం న స్తనోతి
న హ్యేకస్మి న్నతిశయవతాం సన్నిపాతో గుణానాం
ఏకః సూతే కనక ముపలః తత్పరీక్షాక్షమోఽన్యః'[88]

కావ్యరచనాకౌశల మొక విలక్షణశక్తి, కావ్యరసాస్వాదన సామర్థ్యము మతియొక విశిష్టప్రజ్ఞ. మహా ప్రతిభా భాసురులును, నిరంకుశ వైదుషీ భూషితులు నగు మహామహులు రచించిన గ్రంథరాజములకు, శేముషీ సింధువులును, సర్వతోముఖ పాండితీమండితులును, సహృదయశేఖరులును నిర్మించిన వ్యాఖ్యానముల వలననే బహుళవ్యాప్తి లభించును ఇట్టి వ్యాఖ్యాతృశేఖరులలో అగ్రేసరుఁడు మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి సంస్కృతసారస్వత ప్రపంచమున నీయన పవిత్రనామము నెఱుఁగనివారుండరు. కాళిదాసకృత కావ్యత్రయమునకును, కిరాతార్జునీయ శిశుపాలవధ నైషధీయచరితములకును, భట్టికావ్యమునకును, మల్లినాథసూరి రచించిన వ్యాఖ్యానములు యావద్భారతవర్షమున ఖ్యాతినందినవి. పై వ్యాఖ్యానములలో మల్లినాథుఁడు విద్యానాథుని పేరెత్తకయే ప్రతాపరుద్రయశోభూషణమునందలి యాకరములను పరశ్శతముగ ప్రమాణీకరించుకొనెను.

---

87. 'సాహిత్యరత్నాకరము'—పు. 129, 107 (తెనుఁగులిపిప్రతి, మద్రాసు క్రీ. 1871).

88. రాజశేఖరుని 'కావ్యమీమాంస'యం దీశ్లోకము కవినామరహితముగా నుల్లేఖింపఁబడెను (II 14 పు.) G. O. S. No.1-3rd ed-1934 Baroda.

విద్యాకరుని సుభాషితరత్నకోశము (1723 ప. 296 పు) కాళిదాసకృత మని యిటఁ బేర్కొనఁబడెను. Haward Oriental Series No. 42-1957. ఇది కాళిదాస రచనముగా శ్రీధరదాససంకలిత మగు 'సదుక్తికర్ణామృతము'నఁ గూడ నుల్లేఖింపఁబడినది. (Punjab University Series No. 15 - 1933 Lahore)

యశోభూషణ వ్యాఖ్యాతలలోఁ బ్రథమశ్రేణికిఁ జెందిన విద్యాధరుని 'ఏకావళి'కి సాహిత్యశాస్త్ర నిష్ణాతుఁడగు మల్లినాథసూరి 'తరళ' యను ప్రశస్త వ్యాఖ్యానమును రచించెను. దీనినిబట్టి యాతని తనయుఁడును[89] మహావిద్వాంసుఁడునగు కుమారస్వామి సోమపీథి 'ప్రతాపరుద్రీయ' మను మఱియొక యశోభూషణ కృతికి 'రత్నాపణ' మను సద్వ్యాఖ్యను రచించెను. 'పూర్వ శ్లోకగుణోక్తి' అను వ్యాఖ్యానావతారికా శ్లోకమున రత్నాపణ నామసార్థక్యము వక్కాణింపఁబడెను. మల్లినాథునివలె నీతఁడును వ్యాఖ్యాయందమూలములు అనపేక్షితములునగు విషయములను జెప్పనని ప్రతిజ్ఞ చేసెను. కుమారస్వామి క్రీ. శ 15 వ శతాబ్దికిఁ జెందినవాఁడు.

ఈ వ్యాఖ్యాత తన రత్నాపణమున ప్రమాణీకరించుకొనిన ఆకరములు 572; గ్రంథములు 61; గ్రంథకర్తల సంఖ్య 39.

వీనినిబట్టి కుమారస్వామి సోమపీథి సర్వతోముఖవైదుషీభూషితుఁడని విదితమగుచున్నది. ప్రతాపరుద్రయశోభూషణ రత్నాపణముల ప్రాశస్త్యమాతఁడు రచించిన క్రింది శ్లోకమువలనఁ దెల్లమగుచున్నది.

'పూర్వశ్లోకగుణోక్తి శాణకషణాదుత్తేజనాం లమ్భితం
సంగ్రాహ్య రసాకరత్ననిచయం విద్యాధినాథః పురా,
సోఽయం తద్ వ్యవహారహేతు మధునా కించిత్ కరోత్యాపణం
తత్రానుగ్రహమూల్యతోఽఖిలమిదం క్రీణన్తు ధన్యా జనాః'

2. రత్నశాణము: ప్రతాపరుద్రీయమునకు ద్వితీయవ్యాఖ్య రత్నశాణము[90]

---

89. విద్యానాథుఁడే మల్లినాథుఁడను శ్రీ శేషాద్రిరమణకవుల యభిప్రాయము (గోలకొండ కవుల సంచిక, పు. 409-హైదరాబాదు. 1934) నిరాధారము. అట్లే మల్లినాథ పెద్దయార్యులన్నదమ్ములనియు, వారిలో పెద్దయార్యుని కుమారుఁడు కుమారస్వామి యనియు వ్రాసిన కొలచలము నారాయణపండితుని వ్రాఁతయు(చంపూ రామాయణ వ్యాఖ్య) ప్రామాదికము. అఖిలభారత ప్రాచ్యవిద్యాపరిషత్తు All India Oriental Conference-1941) హైదరాబాదు సమావేశములో శ్రీచెలమచర్ల రంగాచార్యులగారిచేఁ జదువఁబడిన 'వ్యాఖ్యాతృ చక్రవర్తీ మల్లినాథః' అను సంస్కృత వ్యాసమున మల్లినాథ కవికాలాది చర్చ విపులముగాఁ జేయఁబడినది.

90. మొదటి రెండు ప్రకరణముల వ్యాఖ్య త్రివేదిపండితుఁడు ప్రకటించిన ప్రతాపరుద్ర యశోభూషణమున అనుబంధముగాఁ (479-586) చేర్పఁబడినది. (1909) ఈ వ్యాఖ్యకు వ్రాఁతప్రతులు మద్రాసున ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునఁ గలవు.

'విద్యానాథః కథ మపి బహో రాకరా చ్ఛాస్త్రజాలాత్
సంజగ్రాహ ప్రకృతిరుచిరే రత్నజాలం కరణ్ణే,
విద్వద్గోష్ఠీవ్యవహరణమణే రత్నశాణేఽధునాఽస్మి
న్నంతర్గూఢమ్యతిలలితం తత్ సమంతాత్తేజయామి.'

రత్నశాణరచయిత చిలకమఱ్ఱి (శుకవట) తిరుమలాచార్యులు. ఈయన తండ్రి రామానుజాచార్యులు; గురువు వాత్స్య రామానుజాచార్యులు. ఈ వ్యాఖ్యాత వాసస్థానము రామతీర్థమను గ్రామము. ఇది నేటి తూర్పుగోదావరి జిల్లా యందలి కోటిపల్లి (కోటిఫలి) అని మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయ పండితుల యభిప్రాయము. కాని ఈ రామతీర్థము ప్రకృతము విశాఖపట్టణ మండలమునకు జెందిన విజయనగరపట్టణ సమీపమున నున్న రామతీర్థమని నా యభిప్రాయము.

రత్నాపణము ప్రౌఢుల కుపకరించు వ్యాఖ్యాన మగుటచే బాలవిబోధనమునకై తాను రత్నశాణము రచించిన ట్లీయపతారికా శ్లోకములవలన దెలియుచున్నది.

'రత్నాపణే విస్తరసాధ్వసేన ముక్తాం పదం కోమలమప్యదేవ
వ్యాఖ్యాయ శంకాపరిహారమార్గః ప్రదర్శితః ప్రాక్తనపండితేన.'
'తతో మయా బాలవిబోధనాయ ప్రతాపరుద్రీయపదప్రపంక్తేః
ప్రకాశ్యతే సర్వపదార్థజాతం న సంభ్రమో న్యత్ర తథాఽప్యథజ్ మే'

రత్నశాణ వ్యాఖ్యానోపసంహారమున నీ క్రింది పుష్పిక వ్యాఖ్యాత యుదంతమును తెలుపుచున్నది.

'ఇతి శ్రీమదుభయ వేదాన్తకాచార్యపురుషపుర గ్రహశిష్య, సర్వవిద్యాపారంగతస్య, శ్రీవాత్స్యవంశ ముక్తామణేః, శ్రీరామానుజాచార్యస్య ప్రియశిష్యేణ వ్యాఖ్యాతృమూర్ధన్య శ్రీవేఙ్కటాచార్య ప్రముఖాగ్రగణ్యభూషిత-శుకవటవంశసంభూత శ్రీరామానుజాచార్యసూనునా, శ్రీరామతీర్థవాసినా, తిరుమలాచార్యేణ విరచితే ప్రతాపరుద్రీయవ్యాఖ్యానే, రత్నశాణాఖ్యానే అలఙ్కార ప్రకరణం సమాప్తమ్.'

తిరుమలాచార్యుని మఱియొక రచన చమత్కార చంద్రిక (=కువలయానందముపై వ్యాఖ్య). ఈ వ్యాఖ్య యముద్రితము. రత్నశాణము తుదినిగల యీ క్రింది శ్లోకము తద్వ్యాఖ్యాకృత్యమును నిరూపించుచున్నది.

'సువృత్తో రత్నశాణోఽయం నిజభ్రమణ వైభవాత్
రత్నాన్యుత్తేజయన్ లోకే జీయా దాచంద్రతారకమ్.'

## 6. ప్రతాపరుద్ర యశోభూషణము : అనుసరణములు - అనువాదములు

1. నృసింహభూపాలీయము - కృష్ణయజ్వ :

ప్రతాపరుద్రీయమునకు సంస్కృతమున నొకటియు, తెలుగున నొకటియు అనుసరణములు కలవు. సంస్కృతానుసరణము సుమ్మకృష్ణయజ్వ రచించిన 'అలంకారముక్తావళి.' దీనికి నృసింహభూపాలీయ మని నామాంతరము; సంస్కృత నరసభూపాలీయమని తెనుగునాట దీనికి వ్యవహారము. కృష్ణయజ్వ వాధూలగోత్రజుడు, సూరిభట్ట తనయుడు ఈతడు విజయనగర ప్రభువగు అళియరామరాజునకు భాగినేయుడగు గొబ్బూరి నృసింహభూపాలున కాశ్రితుడు. అలంకార ముక్తావళి కింకను సూర్యాలోక భాగ్యము కలుగలేదు. దీని తాళపత్రప్రతి అడయార్ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున గలదు. దీని గూర్చి శ్రీ మానవల్లి రామకృష్ణ కవివర్యులు రచించిన వ్యాసరాజము "సంస్కృత నరసభూపాలీయము" అను శీర్షికతో 'భారతి' యందు 21 సంవత్సరములకు బూర్వము ప్రకటింపబడినది.[91] అలంకార ముక్తావళిని, కృష్ణయజ్వను గూర్చి పండిత శిరోమణి వి. కృష్ణమాచార్యులవారు రచించిన యాంగ్ల వ్యాసము అడయార్ గ్రంథాలయ త్రైమాసిక పత్రిక యగు 'బ్రహ్మవిద్య' యందు ముద్రింపబడెను.[92] అడయార్‌లోని ప్రాచ్యప్రతియం దాఱుల్లాసము లున్నట్లు కృష్ణమాచార్యులవారు సూచించియున్నారు. ఆయా యుల్లాసముల యందలి విషయము లీ క్రింది సూచికను బట్టి విశదమగును

ఉల్లాసము

1. వర్ణగణ వివరణము
2. శబ్దార్థ ప్రతిపాదనము.
3. ధ్వనివిశేషవివేచనము.
4. కావ్యవిశేష నిరూపణము
5. నాయక నిరూపణము
6. రసనిరూపణము.

అలంకార ముక్తావళి యందలి యవతారికలోని యీ క్రింది శ్లోకము గ్రంథ ప్రతిపాదిత విషయములను సూచించుచున్నది.

'తేవాలంకృతిశాస్త్రతత్త్వసరణిప్రవ్యక్తయే ప్రేరితః
సాహిత్యార్ణవకైరవప్రణయినా సత్ప్రీతయే సాదరమ్

91. 'భారతి' (ఫిబ్రవరి 1939) పు. 129-33.

92. 'బ్రహ్మవిద్య' (Adayar Library Bulletin) Vol. VII Part 2p. 115,122) (May 1943.)

వక్ష్యామి క్రమశో౽త్ర వర్ణగణయో శ్శబ్దార్థయోశ్చాష్వనేః
వృత్తే శ్చైత్ర్యరసస్య దోషగణయోః స్స్యాలంకృతే స్సద్గుణమ్.[93]

ప్రథమోల్లాసాంతము నందలి పుష్పిక (గద్యము) ఇది.

'ఇతి శ్రీ మద్వాధూలకులతిలక – సుష్టుసమ్రాజ్య – సూరిభట్టోపాధ్యాయ తనయ – కృష్ణయజ్వవిరచితే అలంకారముక్తావళ్యాపరపర్యాయే నృసింహభూపాలీయే అలంకారశాస్త్రే వర్ణగణవివరణం నామ ప్రథమోల్లాసః.'

సంస్కృతాంధ్ర నరసభూపాలీయములు రెండును ప్రతాపరుద్రీయమునకు ప్రతిబింబముల వంటివియే యనియు, సంస్కృత నరసభూపాలీయము నందలి యే దళ్లాసమందు నా యుల్లాసము నే లభించినవనియు ఆంధ్ర నరసభూపాలీయము సంస్కృత నరసభూపాలీయమునకు కనుపానము కాదనియు శ్రీ రామకృష్ణకవిగారి యభిప్రాయము.

ప్రతాపరుద్రీయమునకు, అలంకార ముక్తావళికి ఒక కృతిభర్త నాశ్రయించిన లక్షణము నిచ్చుటయందు సామ్యాన్నను కన్పట్టును. లక్షణ రచనను గూడ కృష్ణయజ్వ ప్రతాపరుద్రీయమును నెగనెడ ననుసరించెను. గ్రంథనిర్మాణ వ్యవస్థయందు సంస్కృతాంధ్ర నరసభూపాలీయములలో భేదము కన్పట్టుచున్నది. ప్రతాపరుద్రీయమున విషయములు సంక్షిప్తముగ సూత్రప్రాయముగాఁ జెప్పఁబడఁగా 'అలంకారముక్తావళి' యందు వ్యాఖ్యాప్రాయముగా వివరింపఁబడెను. కృష్ణయజ్వ ప్రాయికముగా రెండేసి లక్ష్యములొసంగును. ఆంధ్ర నరసభూపాలీయము ప్రతాపరుద్రీయము ననుసరించినది. సంస్కృతాంధ్ర నరసభూపాలీయములకు జన్యజనకభావములేదు. కొంచెమించుమించుగా సమసమయ రచితములగు వీనియందు సామ్యములు లేకపోలేదు. ఈ రెండింటికి నొకానొక సాదృశ్యరేఖ కలదని రామకృష్ణకవిగారి యభిప్రాయము

2 ప్రతాపరుద్రీయము – నరసభూపాలీయము :

నరసభూపాలీయము ప్రతాపరుద్రీయమున కాంధ్రానువాదమనియు, ప్రతాపరుద్రుని స్థానమున నరసభూపాలీయ కర్తయగు భట్టుమూర్తి తన కృతిపతి యగు నరసభూపాలుని జేర్చెననియు వావిళ్ళవారి నరసభూపాలీయపుం బీఠికలో (క్రీ. శ. 1920) నొక్కి వక్కాణింపఁబడెను.

---

93. ఇందు దోషగుణాలంకారవిచారము లగు 2,3 ప్రకరణము లుత్పన్నములని తోఁచును.

